"అశ్వత్థామా! ఆగు" కలబడుతూ గర్జించాడు అర్జునుడు – "దుర్యోధనుడంటే నీకు ఎంత అభిమానమో నీకగ్గిర ఎంతేసి మహాస్త్రాలు వున్నాయో అంతా తెలుస్తూనేవుంది. అయితే పారిపోకండా మాత్రం నిలబడు" అంటూ గాండీవం మోగించాడు.

అసలే మండిపోతున్నాడు అశ్వత్థామ. తటాలున ఆగ్నేయాస్త్రం ప్రయోగించాడు బ్రహ్మాండమైన అగ్నిజ్వాలలతో విజృంభించిందది. గుర్రాలూ, రథాలూ, ఏనుగులూ, పదాతులూ – చతురంగ సేన యావత్తూ కాల్చెయ్యడ మారంభించింది. ప్రళయకాలసంహారంలాగ వొక అక్షౌహిణీసైన్యం మాడ్చేసింది.

"కృష్ణుడూ, అర్జునుడూ ఈ మహాగ్నిహోత్రంలో మండిపోతారు" అంటూ కౌరవసేన ఉబ్బిగంతులు వేసింది. రణవాద్యాలతో ఇన్నూ మన్నూ ఏకంచేసేసింది.

అన్ని మహాస్త్రాలూ అంతంచేసే బ్రహ్మాస్త్రం మంత్రనిష్ఠతో ప్రయోగించాడు అర్జునుడు. అంత ఆగ్నేయాస్త్రమూ వుస్సుమని వూరుకుంది. శ్రీకృష్ణుడు పాంచజన్యం పూరించాడు. అర్జునుడు దేవదత్తం వూదాడు. పాండవయోధులు సింహనాదాలుచేశారు. శంఖాలూ భేరీలూ ఆకాశం బద్దలైపోయింది. కౌరవసేన మొహం వేలవేసింది.

"ఛా, దివ్యాస్త్రాల బలం లేందే యుద్ధమేమిటి, సిగ్గుమాలినపని కాకపోతే!" అని మనసులో తిట్టుకుంటూ ధనుస్సు పారేశాడు అశ్వత్థామ. రథం దిగేసి, వెళ్ళిపోడానికి చరచరా బయలుదేరాడు. ఆకాశగంగ నేలకి దిగినట్టు ఎదురుగుండా వ్యాసముని అవుపించాడు.

"మునీంద్రా!" వినయంతో నమస్కారంచేసి, గద్గదకంఠంతో అన్నాడు అశ్వత్థామ – "నా ఆగ్నేయాస్త్రం వ్యర్థమైపోయింది. ఏమిటీ మాయ? దేవతలూ, రాక్షసులూ, గంధర్వులూ – ఎవ్వరికీ సాధ్యంకాని దివ్యాస్త్రం అది. మానవ మాత్రులైన కృష్ణార్జునుల్ని దహించలేకపోయింది" అని అడిగాడు.

"అడగవలసిన ప్రశ్నే అడిగావు" అంటూ అందుకున్నాడు వ్యాసముని – "నీసందేహం తీరుస్తాను. సావధానంగా విను. ఆదిదేవుడైన విష్ణుమూర్తి లోకసంరక్షణకోసం జన్మించి, మైనాకపర్వతం మీద మహాతపస్సు చేశాడు. గాలిమాత్రం ఆహారం చేసుకుని, చేతులు మీదికెత్తి ఘోరమైన నిష్ఠతో ఎంతోకాలం శివుణ్ణి ధ్యానించాడు. తుదకి ప్రసన్నుడయాడు శివుడు. నెలవంక జడముడితోనూ, శూలమూ పినాకమూ మొదలైనఆయుధాలతోనూ ప్రత్యక్షమయాడు. సాష్టాంగ నమస్కారంచేసి నుంచున్నాడు విష్ణుమూర్తి. అంజలిబంధం నుదుట కీలించాడు. ఎన్నోవిధాల స్తోత్రంచేశాడు. "దేవా, ఎవ్వరికీలేని ప్రభావం నాకు ప్రసాదించు" అని ప్రార్థించాడు.

చల్లనిచూపు చూశాడు శివుడు. మానవులూ, దేవతలూ, రాక్షసులూ, గంధర్వులూ, కిన్నరులూ, గరుడులూ – ఈ యావన్మందినీ, సర్వభూతాలనీ ఇట్టే జయిస్తావు నువ్వు. పరమతేజస్సుతో ప్రకాశిస్తావు. అస్త్రాలూ, శస్త్రాలూ, అగ్నీ, నీరూ ఏదీ ఏమీ చెయ్యలేదు నిన్ను. తడీ, పొడీ, స్థావరమూ, జంగమమూ ఏదీ నిన్ను బాధించలేదు. చావన్నది లేనేలేదు నీకు. అంతకీ వస్తే నన్నే జయించేస్తావు" అని వరమిచ్చాడు. అందుకనే శ్రీమన్నారాయణమూర్తి గెలవరానివాడయాడు. ఆనారాయణమూర్తిలోంచే పుట్టి నరుడూ అంతవాడే అయాడు. నరనారాయణులు ఇద్దరూ ఒకళ్ళని వొకళ్ళు విడిచిపెట్టరు. నరుడినేస్తం నారాయణుడు. నిజమాయావిశేషంతో జగన్మోహనుడై విహరిస్తాడతడు. ఆఇద్దరూ, రాక్షసుల్ని వధించడానికీ, ధర్మం స్థాపించడానికీ అవసరమైనప్పుడు అవతరిస్తూ వుంటారు. అదిగో ఆ నరనారాయణులే ఈ అర్జునుడూ, కృష్ణుడూనూ.

"నువ్వూ లోగడ తపస్సుచేసినవాడివే. తేజశ్శాలివే. విద్యావిభవం కలవాడివే. అయినా, వాళ్ళకీ నీకూ ఎంతో అంతరం వుంది. చెపుతాను, విను.

"తొలిజన్మలో నువ్వు మట్టితో ప్రతిమచేసి, అందులో పరమేశ్వరుణ్ణి ఆవహింపజేసి పూజించావు. వాళ్ళు లింగం ప్రతిష్ఠించి పూజించారు. ఎలాచేసినా పరమేశ్వరారాధన సర్వార్థాలు సాధించి పెడుతుంది. అందులోనూ లింగపూజ ప్రతిమపూజకంటే శ్రేష్ఠమైంది. అంచేత లింగారాధనచేసిన కృష్ణార్జునుల్ని ప్రతిమారాధకుడివైన నువ్వు ఎలా గెలుస్తావు? మీమీ పూర్వజన్మల పూజాఫలాలు తారతమ్యాలతో మీరు అనుభవించక తప్పదు కదా!" అన్నాడు.

వ్యాసముని చెప్పిందంతా విన్నాడు అశ్వత్థామ. అతడిశరీరం పులకరించింది. శివుణ్ణి ధ్యానించి నమస్కరించాడు. శ్రీకృష్ణుణ్ణి మనసారా ప్రశంసించాడు. వ్యాసమునికి పాదాభివందనం చేశాడు.

వ్యాసముని అంతర్థానమయ్యాడు. అశ్వత్థామ తిరిగి తన రథం మీదికి వచ్చేశాడు. పడమట అస్తమిస్తూన్న సూర్యబింబం చూస్తూ దుర్యోధనుడిదగ్గిరికి వచ్చాడు. "పొద్దుగూకిపోతోంది. సైన్యాలు మళ్ళించు" అని హెచ్చరించాడు.

దిగాలుమంటూవున్న మొహాలతో కౌరవులు శిబిరంచేరారు. ఎన్నో అన్ని యుద్ధవాద్యాలు మోగిస్తూ, సింహనాదాలు చేస్తూ, పుప్పొంగిన సముద్రంలా ఉల్లాసంతోవున్న సైన్యంమళ్ళించుకుని, నిశ్చింతగా, నవ్వుతూ, కేరుతూ శిబిరాలికి వెళ్ళారు పాండవులు.

శిబిరం చేరాక అర్జునుడి గుడారానికి వ్యాసముని వెళ్ళాడు. దూరంనించే చూశాడు అర్జునుడు. తడబడిపోతూ ఎదురువెళ్ళాడు. ఎంతో వినయంతో దండప్రణామంచేసి తోడితెచ్చాడు. ఆసనమూ, అర్ఘ్యమూ, పాద్యమూ ఇచ్చి పూజించాడు. చేతులు జోడించి నేల మీద కూచున్నాడు. ప్రసన్నంగావున్న మునిమొహంచూస్తూ మెల్లి మెల్లిగా ఇలా అడిగాడు: "తండ్రీ, ఎన్నాళ్ళయో అడగా లనుకుంటాను. ఇవాళ నీ అనుగ్రహం కలిగింది. యుద్ధంలో నేను శత్రువుల్ని కొట్టడానికి పూనుకున్నప్పుడల్లా నాముందట అగ్నిహోత్రుడిలాంటి

దివ్యపురుషుడు వొకడు అవుపిస్తాడు. అతడి శరీరం కిరణాలతో ప్రకాశిస్తూ వుంటుంది. చేతిలో శూలముంటుంది. అందులోంచి ఘోరమైన శూలాలు పరంపరగా బైలుదేరుతూ వుంటాయి. అవే శత్రువుల్ని చంపేస్తూ వుంటాయి. నేను వెనకనించి బాణాలు వేస్తూ చంపానను కుంటాను, గెలుపు సాధిస్తూ.

"ఆ దివ్యపురుషుడు ఎవ్వడో అని ఎప్పుడూ అనుకుంటూ వుంటాను. మహాత్మా, ఎవరో అతడు?"

"అర్జునా," ఆదరంగా అన్నాడు ముని — "అదృష్టవంతుడివోయి నువ్వు. ఆదివ్యపురుషుడు సాక్షాత్తూ పరమశివుడు. ఆదికీ, అది లోకాలికీ అతడే ప్రభువు. పేదకి పెన్నిధి దొరికినట్టు దొరికాడు నీకు. కృతార్థుడివయ్యావు. ఆయనవల్ల ఎంతటిశత్రువయినా నాశనమవుతాడు. ఆయన పూనుకున్నాడు కనకనే శత్రుసంహారం అంత సులువయింది నీకు. లోగడ దర్శనమిచ్చి, దివ్యాస్త్రాలు ప్రసాదించాడు. అంతతో తనివితీరలేదు ఆమహాదేవుడికి. భక్తులంటే ఆయనకి ప్రాణం. కనక ఇలా తనవాత్సల్యం ప్రకటిస్తున్నాడు. నువ్వు పుణ్యాత్ముడివి నాయనా ఆపరమాత్ముణ్ణి ఆత్మలో నిలిపి నమస్కరించు. సర్వలోకాలికీ ఆయనే ఆశ్రయం. అతణ్ణి ఆశ్రయించు. కరుణాకరుడతడు. తన శరణార్థులికి ఆయుస్సూ, ఆరోగ్యమూ, ఐశ్వర్యమూ అన్నీ అనుగ్రహిస్తాడు" అన్నాడు.

వ్యాసముని మాటలు ఆశ్చర్యంగా విన్నాడు అర్జునుడు. భక్తిపూర్వకంగా శివుణ్ణి ధ్యానించాడు; దండప్రణామం చేశాడు. వ్యాసమునికి పాదాభివందనం చేశాడు.

"సుఖపడు" అంటూ దీవించి వ్యాసముని అంతర్ధానమయ్యాడు.

వ్యాసమహాభారతం

ద్రోణపర్వం

సంపూర్ణం.